# ఆత్మషట్కము-6

## శ్రీ శంకరాచార్యులవారు

నాహం జాతో జన్మమృత్యూ కుతో మే
నాహం ప్రాణః క్షుత్పిపాసే కుతో మే
నాహం చిత్తం శోకమోహౌ కుతో మే
నాహం కర్తా బన్ధ మోక్షౌ కుతో మే.

తా॥ నేను వాస్తవముగ పుట్టలేదు. కావున నాకిక జననమరణము లెచట? నేను ప్రాణము కాను. కావున నాకిక (ప్రాణ ధర్మము లగు) ఆకలిదప్పులెచట? నేను మనస్సు కాను. కావున నాకిక (మనోధర్మములగు) శోక మోహములెచట? నేను కర్తను కాను. కావున నాకిక (కర్తృధర్మములగు) బంధమోక్షము లెచట?

వ్యాఖ్య :- జీవుని యథార్థస్వరూపమిచట తేటతెల్లముగ వివరింపబడుచున్నది. జీవుని వాస్తవస్వరూపము ఆత్మయే కాబట్టి, అతనికి యథార్థముగ చావుపుట్టుకలు కాని, ఆకలిదప్పులు కాని, శోకమోహములుకాని, బంధమోక్షాది ద్వంద్వములు కాని లేవు. అవియన్నియు ఉపాధికి సంబంధించినవే యగును. తాను ఉపాధికంటె వేఱుగనుండుటవలన ప్రకృతి ధర్మములెవ్వియు తనకు లేవని నిశ్చయించి సాధకుడు నిరంతరము ఆత్మయందే నిలకడకలిగి గంభీరముగ వర్తించవలెను. ఆనందమే తన జన్మహక్కని భావించి, అట్టి బ్రహ్మానందసాగరమున సతతము ఓలలాడుచు, జీవయాత్రను ప్రశాంతముగ కొనసాగించవలెను.

ఓం

ఓం
శ్రీ శుకబ్రహ్మాశ్రమము
శ్రీకాళహస్తి
# వేదాంతభేరి
సంస్థాపకులు:
శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాముల వారు

సంపుటము : 24 అక్టోబరు 1992 సంచిక 10



| | |
|---|---|
| సంవత్సర చందా : | రూ. 30/-లు |
| పంపవలసిన అడ్రసు : | మేనేజరు, వేదాంతభేరి కార్యాలయము<br>అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట<br>పి.బి.నెం.323, విజయవాడ-520 002<br>ఫోన్స్ : 61862, 64017, 72433<br>Telex : 0475 362 ANIL Fax : 0866-63017 |
| శాశ్వత చందా : | రూ. 300/-లు. |
| పంపవలసిన అడ్రసు : | 'వేదాంతభేరి శాశ్వతనిధి'<br>శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము<br>పోస్టు, శ్రీకాళహస్తి-517 640<br>ఫోన్స్: 2239,2543 STD Code 085 78 |

చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా నంబరు తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో వచ్చు 'వేదాంతభేరి' కవరుపైయుండును.

# వేదాంతభేరి

అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక

**BE FEARLESS : నిర్భయులై యుండుడు!**

## విషయసూచిక



**: ముఖచిత్రము :**

అలమేలుమంగా, పద్మావతీ సమేతా!
అభయవరద హస్తా! శంఖచక్రపాణీ!
కల్యాణ వేంకటనాయకా! ప్రసన్నుడవై
భక్తజనులను పరిపాలించే నారాయణా!
ద్వారకా తిరుమలేశా! నమోనమః.

# ప్రార్థన



## సరస్వతీ ప్రార్థన

ఓమ్ రవి రుద్ర పితామహ విష్ణునుతం
హరిచందన కుంకుమ పంకయుతమ్
మునివృన్ద గణేన్ద్ర సమానయుతం
తవ నౌమి సరస్వతి పాదయుగమ్.

సూర్య, రుద్ర, బ్రహ్మ, విష్ణువులచే స్తుతింపబడునదియు, చందన కుంకుమాదులు పూయబడి యున్నదియు, ముని సమూహము చేతను, గణేశునిచేతను సేవింపబడునదియునగు శ్రీ సరస్వతీదేవి యొక్క పాద పద్మములకు నమస్కరించుచున్నాను.



అక్టోబరు 1992

# వివేకానంద శంఖారావము



**W**hen the purusha finds that It is free, and does not require anything to complete Itself, that this Nature is quite unnecessary, then freedom (Kaivalya) is attained.

జీవుడెప్పుడు వాస్తవముగ తాను సర్వస్వతంత్రుడననియు, తనను పూర్ణమొనర్చుటకు మఱియొక వస్తువుతో పనిలేదనియు, ఈ ప్రకృతితో తనకు పనిలేదనియు తెలిసికొనునో, అపుడతనికి కైవల్యము (మోక్షము) లభించును.

○○

# వేదాంతభేరి



# అనంత సుఖము

శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



శేరుతోగాని, మానికతోగాని ధాన్యమును కొలుచునపుడు వర్తకుడు ప్రారంభమున 'ఒకటి' అని అనడు. 'లాభం' అని పలుకును. అట్లే ఆరు వఱకు కొలిచినపిమ్మట 'ఏడు' అని అనడు. 'ఆరున్నొకటి' అని చెప్పును. దీని అంతరార్థమేమి? ప్రతి ప్రాణియు లాభమునే కోరుచున్నాడు కాని నష్టమును కోరుటలేదు. అదే విధముగ 'ఏడువు'ను 'దుఃఖము'ను కాంక్షింపక 'నవ్వు'నే (సుఖమునే) అపేక్షించుచున్నాడు. ప్రతి జీవికిని ఇట్టి స్వభావము నైజముగనే ఏర్పడుచున్నది. దుఃఖరాహిత్యము, ఆనందప్రాప్తి– అను లక్ష్యసిద్ధి కొఱకే పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సమస్త ప్రాణికోట్లు పడరాని పాట్లు పడుచున్నవి. కాని లక్ష్యము సిద్ధించుచున్నదా అనునదియే ప్రశ్న.

మానవుడుగాని, జంతువుగాని ఇంద్రియముల ద్వారా పొందు సుఖము పరిపూర్ణమైనది కాదు. అది పరిచ్ఛిన్నసుఖము. ఆభాససుఖము. ప్రతిబింబసుఖము. దుఃఖమిశ్రితసుఖము. విజ్ఞుడగు మానవుడు నిరతిశయ పరిపూర్ణసుఖము కొఱకే యత్నించవలెనుగాని, విషయజనిత అల్పసుఖము కొఱకుగాదు. ఇంద్రియసుఖము పశుపక్ష్యాదులుకూడ అనుభవించుచున్నవి. కావున, అద్దానికొఱకై ఉత్కృష్టమైన మానవజన్మను బడయవలసిన పని

లేదు. కరుణామయుడగు సర్వేశ్వరుడు జీవుల పుణ్యపరిపాకముననుసరించి ఎపుడు మానవత్వమును అనుగ్రహించెనో, బ్రహ్మానందసామ్రాజ్యమున కది చక్కని నాందిగా తలంచి దానిని సద్వినియోగపఱచవలెను. పూర్ణసుఖము తన ఆత్మయందే కలదని శాస్త్రములవలన, సద్గురూపదేశమువలన, స్వానుభవమువలన గుర్తెఱిగి, జీవితమంతయు అట్టి అంతరంగ సౌభాగ్యసంపత్తి సాధనకై, ఆత్మానుభూతికై వినియోగించవలెను.

భౌతిక ప్రపంచంలోగల సమస్త ఆనందములకంటెను చతుర్ముఖానందము చాల గొప్పదని ప్రతీతి. అట్టి చతుర్ముఖానందము కూడా బ్రహ్మానందసాగరమున ఒక చిన్నబొట్టు అని ఉపనిషత్తులుద్ఘోషించుచుండుట చూడ దైవానంద మెంతటి మహోన్నత స్థానమాక్రమించికొని యున్నదో విశదమగుచున్నది.

Aim at a lion and miss it, rather than hunt a jackal and catch it.

'గురి తప్పిననుసరే సింహము వైపునకే గురిపెట్టుము. అత్తఱి జనులు నీ సాహసమును గూర్చి శ్లాఘింతురు. అంతియేకాని, నక్కకు గురి పెట్టి దానిని పట్టి తెచ్చినప్పటికి నిన్ను గూర్చి అనుకొనువారే యుండరు' అని ఆంగ్లోక్తి. కావున మహోన్నతమగు ఆత్మానందసంప్రాప్తికొఱకే జీవుడు అహర్నిశములు పాటుపడవలయునుగాని అల్పమగు పశుపక్ష్యాదుల సుఖముకొఱకు గాదు.

ఎందఱో రాజాధిరాజులు ధనధాన్యసంపత్పరిపూరితములైనట్టియు, లక్ష్మీకటాక్షము తాండవించునట్టియు తమ సౌభాగ్యములన్నిటిని తృటిలో త్యజించివైచి అరణ్యములకేగి ఏకాంతమున బ్రహ్మనిష్ఠులైయుండుట గమనించిన ఆ దైవానందము ప్రపంచ సుఖముల కన్నిటికంటెను మేటి యని విస్పష్టముగ తెలియుచున్నది. కాకున్న వారు రాజ్యముల నేల వదలవలెను? ఏదియో యొక గొప్పప్రయోజనము నుద్దేశించియే వారట్లు చేసిరి. రాజ్యసుఖముకంటె, భౌతికానందముకంటె మించినది మఱియొకటి ఉన్నపుడే వారు తమ రాజ్యాదులను త్యజించుట సంభవించును. అదియే ఆత్మసుఖము. అదియే అనంతసుఖము. ○○

# భక్తి ప్రబోధము

## శ్రీ పి.ఎ.ఎన్. పట్నాయక్ గారు (శ్రీకాకుళం)

గీత చదవండి యెప్పుడు విసుగులేక
గీత వినరండి జాతి భేదంబులేక
గీత మాటని నమ్మండి భక్తులార
గీతయే మన గీత మార్చు కృష్ణగీత.

కర్మ చేయండి కృష్ణపరమాత్మ చెప్పినట్లు
ఫలితమొదలండి వానికే భక్తి తోడ
అట్లు చేసిన కర్మయే యజ్ఞమగును
అట్టి యజ్ఞము వలననే అజ్ఞాని జ్ఞానియగును.

పేదవానికి పిడికిడన్నము పెట్టి
చేత కొన్ని పైసలు పెట్టి
మూరెడు వస్త్రంబు కప్పివేసి
యెంతయో పుణ్యంబు వచ్చు నీకు.

కష్టసమయమునందందుము "రామ రామ"
సుఖమురాగానె విడుతుము "రామ రామ"
రామ అనగానే కష్టములు పోవునట్లు
రామ విడగానె కష్టములు దాపురించు.

తీపిలన్నింటిలోనూ అతితీపి రామనామం
బాణంబులన్నింటిలోను అతి వాడి రామబాణం
రామ అన్నది సామాన్య రామ కాదు
రామలోనే నిమిడియున్న దీ భూప్రపంచమంత.

6. చిలుక పలుకును రామ రామని గాని
దుర్జనుడు పలకడు రామ రామ
వాని ఖర్మము మనమేమి సేతుము రామ రామ
అట్టివానికికూడ జ్ఞానమొనగును రామ రామ.

7. ఎవరిమట్టుకు వారె గొప్పవారమటంచు
విర్రవీగుచుంద్రు వుర్వి జనులు
గొప్ప అనునది తనకది ముప్పుకాని
గొప్పలేని జీవితమే నిజమైన గొప్పనిచ్చు.

8. 'నేను' 'నాది' అను రెండు శతృవుల్ వెంటాడుచుండు
'నేను' నేను కాదని 'నాది' నాది కాదని
తెలుసుకొనువాడె నిజమైన నరుడు
అటినరుడే యెప్పుడైనను స్వర్గంబు పొందు ఇలలో.

9. నేనేమి వ్రాసిన నేనేమి చదివిన
అంతయూ శ్రీరామలీల నమ్మి
నేను చేయునదేమి లేదీ ప్రపంచమందు
రామలీలలో నేనొక కీలుబొమ్మ.

10. తనువు చాలించు సత్యమయమందు
రామ రామ యనండి భక్తితోడ
రాముడొచ్చును తప్పక రథముతోను
విన్ను గొనిపోవు వారి నివాసమునకు.

Name and form are not real.
lives. Soul alone lives. Hold on to that

నామరూపములు సత్యములు కావు. దేవుడే సత్యము.
ఆత్మయే సత్యము. సత్యమునే ఆశ్రయింపుము.

వేదాంతభేరి

# ధర్మం శరణం గచ్ఛామి

## ఇద్దరు మిత్రుల కథ

### శ్రీ బోధచైతన్య గారు

శ్రావస్తిలోని ఉన్నత కుటుంబాలకు చెందిన ఇద్దరు యువకులు మంచి మిత్రులు. వాళ్ళిద్దరూ ఒకనాడు గౌతమబుద్ధుని ప్రబోధాలకు పరవశులై ఆయన సంఘంలో చేరిపోయారు. వారిద్దరిలో ఒకనికి పాండిత్యం మీదెక్కువ దృష్టి. అతను అదేపనిగా గ్రంథాలను పఠిస్తూ కొన్నేండ్లకు గొప్ప పండితుడైపోయాడు. విడిగా ఒక ఆశ్రమాన్ని నెలకొల్పుకొని 18 శాఖలకు చెందిన సుమారు 500 మంది భిక్షువులకు అధ్యాపకుడుగా వుంటూ గొప్ప పేరు తెచ్చుకొంటున్నాడు.

మరొకనికి పాండిత్యం మీద అంత రుచి లేదు. అధ్యాత్మ జీవనానికి పనికి వచ్చే కొన్ని సూత్రాలు మాత్రం చదువుకొని ఎక్కువ కాలాన్ని విపశ్యన సాధనకు (ఒకానొక ధ్యాన సాధనకు) వినియోగిస్తూ కొంతకాలానికి అర్హత్వాన్ని పొందగలిగాడు. విడిగా ఆశ్రమం పెట్టుకోకుండా అతను బుద్ధుని వెంటే వుండేవాడు.

ఇలా సంవత్సరాలు గడిచాయి. జేతవనానికి బుద్ధుడు విజయంచేసిన వార్త పండిత భిక్షువుకు చేరింది. బుద్ధదేవుని దర్శనభాగ్యం కోసం అతను వేగిరంగా అక్కడికి వచ్చాడు. చిరకాలానికి తన మిత్రుణ్ణి కూడ చూడడం అతనికి ఆనందం వేసింది. తన మిత్రుడు అర్హత్వాన్ని పొందిన వ్యక్తి అని మాత్రం గుర్తించలేదు. చదువంటే గిట్టని సోమరి అని భావించి అతణ్ణి ఆట పట్టించాలనుకొన్నాడు. 'ఇతను ఐదు నికాయాల్లో ఒక్కటి కూడా చదువుకోలేదు. మూడు పిటకాల్లో ఒక్క పిటకాన్ని కూడ అధ్యయనం చేయలేదు. ఈ సాయంత్రం ఇతణ్ణి నికాయాలకు, పిటకాలకు సంబంధించిన ప్రశ్నలు అనేకం వేసి చీకాకుపెట్టి వేడుకపొందుతాను' అని మనస్సులో అనుకున్నాడు.

అభిజ్ఞుడైన (ఇతరుల ఆలోచనలను తెలుసుకొనగల శక్తిని అభిజ్ఞ అంటారు) బుద్ధునికి అతని ఆలోచన తెలిసిపోయింది. ప్రశ్నల తంతును నివారించాలనుకొన్నాడు. ఒక అర్హతుణ్ణి ఆటపట్టించే దోషంనుండి ఆ పండిత భిక్షువును తప్పిం

చాలనుకొన్నాడు. ఆ ఇద్దరు మిత్రులు సంభాషణలోకి దిగే సమయానికి అక్కడికి వెళ్ళి ప్రశ్నలు వేసే పనిని తానే తీసుకొన్నాడు. "ధ్యానం అంటే ఏమిటి? దాని వివిధ స్థాయిలేమిటి? వివిధ స్థాయిల్లో కలిగే అనుభూతులేమిటి? ఆయాస్థాయిల్లో ఎదురయ్యే ఆటంకాలేమిటి? వాటిని అధిగమించడం ఎలా?" ఇలాంటి ప్రశ్నలువేయడం మొదలుపెట్టాడు. ఈ హఠాత్పరిణామాన్ని పండిత భిక్షువు ఎదురుచూడలేదు. ఈ ప్రశ్నలకు సమాధానాలు పుస్తకాల్లో వుండవు. ఉన్నా అవి పనిచేయవు. స్వానుభవం ద్వారా బదులివ్వాల్సిన ప్రశ్నలవి. పండితభిక్షువు ఎప్పుడూ ధ్యానం జోలికి పోయిన వాడు కాదు. కాలమంతా గ్రంథపఠనానికి, ధారణకు వినియోగించాడు. ఒక్క ప్రశ్నకు కూడ సమాధానం చెప్పలేక తెల్లమొహంతో మౌనం దాల్చాడు. చదువురాని భిక్షువు చాలా వినయంగా ఆయా ప్రశ్నలకు తన అనుభవం నుండి సరైన సమాధానాలు చెప్పాడు. గ్రంథికుని కన్నా విపశ్యకుడు మిన్న అనే విషయాన్ని తేల్చివేసి బుద్ధుడు తన కుటీరానికి వెళ్ళిపోయాడు.

ఆ పిమ్మట అక్కడ గుమికూడిన భిక్షువులనుద్దేశించి ఇలా అన్నాడు : "ధర్మ విషయాలను చదువడమే పనిగా పెట్టుకొని అనుష్ఠించడం అనే అతి ముఖ్య విషయాన్ని ఉపేక్షించినవాడు జీతానికి పనిచేస్తున్న పశులకాపరిలాంటివాడు. ఆ పని వల్ల అతనికి రావలసిన జీతం మాత్రమే వస్తుంది. పాండిత్యమువల్ల దీనికి జీతంగా సత్కారసన్మానాలు, శిష్యుల సేవలు వగైరా లభిస్తాయి. ధర్మాన్ని చక్కగా అనుష్ఠించే వాడు పంచగవ్యాలను ( పాలు, మీగడ, వెన్న, మజ్జిగ, నెయ్యి) హక్కుభుక్తంగా కలిగిన పశుల యజమానిలాంటివాడు. పంచగవ్యాలు దేహానికి ఆరోగ్యాన్ని ప్రసాదిస్తాయి. అలాగే ధర్మానుష్ఠానం మానసికారోగ్యాన్ని ప్రసాదిస్తుంది. అధ్యాత్మ జీవనంలో ముఖ్యమైంది పాండిత్యం కాదు. వైరాగ్యాన్ని పెంచుకోవడము ద్వారా రాగద్వేష మోహాలను వదిలించుకోవడమే ముఖ్య కర్తవ్యము" చివరగా పై అర్థం వచ్చే ఈ క్రింది రెండు శ్లోకాలను కూడా పఠించాడు.

**బహ్వామపి సంహితాం భాషమాణః । న తత్కరో భవతి నరః ప్రమత్తః**
**గోప ఇవ గా గణయన్ పరేషాం । న భాగవాన్ శ్రామణ్యస్య భవతి**

-ధర్మపదం 1-19

అల్పామపి సంహితాం భాషమాణః । ధర్మస్య భవత్యనుధర్మచారీ
రాగం చ ద్వేషం చ ప్రమాయ మోహం । సమ్యక్ ప్రజానన్ సువిముక్తచిత్తః
అనుపాదాన ఇహ వా అముత్ర వా । న భాగవాన్ శ్రామణ్యస్య భవతి

-ధర్మపదం 1-20 OO



1. గోపాలా బృందావనపాలా । గోపీలోలా గోకులబాలా
మురళీలోలా మునిజనపాలా । సురమునివందిత గోపాలబాలా
రాధాలోలా రమ్యసుచేలా । రాజిత వనమాలా గోపాలా
వేణువిలోలా విజయగోపాలా । ఆగమమూలా గోపాలా
నందకిషోరా నవనీతచోరా । మంజులభాషా మణిమయభూషా॥

2. జయ గణనాథా జయ గణనాథా
మునిగణ పూజిత జయ గణనాథా
జగత్త్రియాధిప జయ గణనాథా
ఈశ్వరతనయా జయగణనాథా॥

3. రామచంద్ర పాహిమాం । రామకృష్ణ రక్షమాం
కృష్ణచంద్ర పాహిమాం । వాసుదేవ రక్షమాం

OO

## మార్కండేయ ఉవాచ

సాహానిస్తన్మహచ్ఛిద్రం సా చాంధజడమూఢతా
యన్ముహూర్తం క్షణమపి వాసుదేవం నచిన్తయేత్.

ముహూర్తకాలముగాని, క్షణకాలముగాని వాసుదేవుని గూర్చి ధ్యానింపకుండుట యేది కలదో అదియే గొప్ప హాని, అదియే గొప్ప లోపము, అదియే గ్రుడ్డితనము, అదియే జడత్వము, అదియే మూఢత్వము అని తెలియనగును.

[illegible]

[illegible]

[illegible]

గోక్షీరమేకం బహుధేనుజాతం

ఏకః పరాత్మా బహుదేహవర్తీ.

పెక్కు కుండల రూపమున ఉన్నను మట్టి ఒకటే. అనేక ఆభరణముల రూపమున ఉన్నను బంగారము ఒక్కటే. అనేక గోవుల నుండి పిండినదైనప్పటికిని పాలు ఒక్కటే. అట్లే అనేక దేహములందు వర్తించుచున్నను పరమాత్మ ఒక్కడే.

[illegible]

[illegible]

సన్న్యాసులకు ఇంద్రియ నిగ్రహము, వానప్రస్థులకు నియమపాలనము, గృహస్థులకు దానము, బ్రహ్మచారులకు గురుశుశ్రూష ముఖ్యములు. ○○

---

ఈ వార్తను బుద్ధుడు ఒక దృష్టాంతంగా తీసుకొని వారికి ఇలా చెప్పారు : "దొంగల ముఠాకు భయపడి మహాధనుడు ప్రయాణాన్ని మానుకొన్నాడు. జీవితేచ్ఛ ఉన్నవాడు విషాన్ని దగ్గరకు రానివ్వడు. ఈ సంసారకాననం కూడ క్లేశ తస్కరులచే ఆక్రాంతమై ఉంది. (రాగం, ద్వేషం, మోహం మొదలైన క్లేశములు). కనుక ఇక్కడ రాకపోకలను కట్టిపెట్టి క్షేమదాయకమైన నిర్వాణపురంవైపు మీరు కూడా ప్రయాణం చేయాలి" అని చెప్పి క్రింది శ్లోకాన్ని పఠించారు.

[illegible]

[illegible] -ధర్మపదం 9-8

భయంకరమైన మార్గాన్ని మందిబలం తక్కువగా ఉన్న మహాధనుడు పరిహరించినట్లుగా, జీవితేచ్ఛ ఉన్నవాడు విషాహారాన్ని పరిహరించినట్లుగా అభ్యుదయ నిశ్శ్రేయసకాముడు పాపాలను పరిహరించవలెను. ○○

# ఆధ్యాత్మిక  కథలు

## పూర్ణ దైవ విశ్వాసము

ఒక ఊరిలో ఒక దంపతులు కలరు. భార్యాభర్తలిరువురును అన్యోన్య సద్భావముకలవారై తమ గృహస్థ జీవితమును చక్కగ నిర్వర్తించుచుండిరి. భర్తకు దేవునిపై అచంచలమైన విశ్వాసము కలదు. ప్రతి రోజు నియమము తప్పక అతడు ధ్యానాద్యనుష్ఠానములు సలుపక గంగయే ముట్టడు. భార్యకు దేవునిపై పూర్ణవిశ్వాసము లేదు. అయినను భర్తయొక్క భక్తిపూర్వక ఆచరణను చూచి రోజు ఒకింత దైవచింతన మాత్రము చేయుచుండును. క్రమముగ ఇంటిపనులలో పడి భార్య ఆ కొంచెము అనుష్ఠానము కూడా వదలివేసెను.

అది చూచి భర్త ఒకనాడు భార్యను కూర్చుండబెట్టి దైవభక్తిని ఏ కోశమున విడనాడవద్దనియు, దానివలన ఎంతయో మేలు చేకూరు ననియు, దైవానుగ్రహమునకు పాత్రులు కాగలరనియు ఎన్నియో విధముల నచ్చచెప్పి చూచెను. కానీ ఆమె పూర్వసుకృతము సరిలేదు. అందుచే ఆమె భర్త బోధను ఆచరణయందుంచలేదు.

అది చూచి భర్త పెద్ద పెద్ద సాధనలు ఆమె చేయలేదని తలంచి ప్రతిదినము దేవునకు ఒక్కసారి సాష్టాంగ దండప్రణామము చేయవలసినదిగా ఆదేశించెను. మఱుసటి దినమందు భార్య ఆ ప్రకారముగ సాష్టాంగ వందనమాచరించ లేదు. అపుడు భర్త "ఏల దేవునకు నమస్కరించలేదు" అని అడుగ మనస్సులో దేవునకు దణ్ణము పెట్టితినని బదులుచెప్పి తప్పించుకొనినది.

కొన్నాళ్ళకు భార్య భర్తతో "ఏమండీ! మన వీధిలోనివారందరును ▭

# అమృత బిందువులు

ఉద్యమేనైవ సిద్ధ్యంతి కార్యాణి న మనోరథైః

నహిసుప్తస్య సింహస్య ప్రవిశంతి ముఖేమృగాః.

ప్రయత్నముచేతనే పనులు నెరవేరునుగాని వట్టి ఆలోచనలచే కాదు. మృగరాజైనను ఊరక పండుకొనియున్నచో ఆహారము లభించదుగదా!

జ్ఞానేన తుల్యో విధిరస్తి నాన్యో

లోభాచ్చ నాన్యోఽస్తి రిపుః పృథివ్యాం

విభూషణం శీల సమం న చాన్యత్

సంతోషతుల్యం ధనమస్తి నాన్యత్.

జ్ఞానముతో సమానమైన ధనము లేదు. లోభముతో సమానమైన శత్రువు లేదు. శీలముతో సమానమైన అలంకారము లేదు. సంతుష్టితో సమానమైన ధనము లేదు.

OO

మంచి మంచి చీరెలను ధరించుచున్నారు. వివాహమైనప్పటినుండియు మీరు నాకు ఒక్క మంచి చీరె కూడ కొనిపెట్టలేదు" అని అడుగగా "చీరె కొనటం దేనికి? మనస్సులో కట్టితే చాలదా?" అని భర్త మందలించెను.

భార్య తన పొరపాటునకు సిగ్గుపడి ఆనాటినుండి దేవునకు భక్తి పూర్వకముగ సాష్టాంగవందనమాచరించుచుండెను. ఆమె సత్ప్రవర్తన చూచి భర్త ఆమెకు చీర కొనిపెట్టి సంతోషపరచెను.

నీతి : దేవునిపై పరిపూర్ణ విశ్వాసము కలిగియుండవలెను. హృదయ పూర్వకముగ భగవంతుని సేవించవలెను. సాధనయందు సందేహము కలిగి యుండరాదు. పూర్ణవిశ్వాసము, ఏకాగ్రత, భక్తితో భగవంతుని సేవించ వలయును.

OO

వేదాంతభేరి

# రామాయణ ప్రభ

## సీతమ్మ హితవు

ధర్మముచే సుఖము కలుగుచున్నది. ధర్మముచేతనే మనుజుడు సమస్తమును పొందగలుగుచున్నాడు. ఈ ప్రపంచమున ధర్మమే సారమై యున్నది. వివేకవంతులు యత్నపూర్వకముగ ధర్మమును సంపాదించుచున్నారు.

ప్రాణులందఱు వారు వారు చేసిన శుభాశుభకర్మల యొక్క ఫలమును అనుభవించుదురు. శ్రేష్ఠుడగువాడు ఇతరులకు చెడ్డచేయు పాపులయొక్క పాప కర్మను స్వీకరింపడు. మఱియు తిరిగి వారియెడల పాపపూర్ణమగు ప్రవర్తనమును గావించదలంచడు.

సాధుపురుషుడు తన ఉత్తమ చరిత్ర చేతనే విభూషితుడగుచున్నాడు. సదాచారమే అతని భూషణమై యున్నది. శ్రేష్ఠుడైనవాడు పాపియైనను, పుణ్యాత్ముడైనను, వధింపయోగ్యమగు అపరాధమొనర్చినవాడైనను, వారందఱి యెడల దయ కలిగియుండవలెను. జనులను హింసించువారు, సదా పాపమునే ఆచరించువారునగు క్రూరస్వభావముగల పాపులకు కూడ అమంగళమును చేయరాదు. ○○

---

**Slow and steady wins the race**

మృద్దేహికాల్పదేహోపి ముఖాగ్రేణాప్యణీయసా
కరోతి మృద్భారచయముపదేశస్స యోగినః.

చదవురుగు చిన్నదేహము కలిగియున్నను, తన చిన్న నోటితో చిన్న చిన్న అణువులను సమకూర్చి పెద్ద పుట్టను నిర్మించుచున్నది. అట్లే సాధకుడు మొదట చిన్న చిన్న అనుష్ఠానములను మెల్లి మెల్లగా చేయుచు తుదకు పరమమగు ఆత్మను పొందవలయును. తొందర పడరాదు. నిబ్బరము కలిగి ఏ మాత్రము కంగారుపడక ధైర్యముతో శాంతముగ ఒక్కొక్క సాధనము పూర్తిచేసికొనుచు ముందునకు కొనసాగిపోవుచుండవలెను.

# ఆత్మానుసంధానము

సాధకులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.

అహం బ్రహ్మోఽస్మి మంత్రోఽయం
బుద్ధివ్యాధిం వినాశయేత్!
అహం బ్రహ్మోఽస్మి మంత్రోఽయం
చిత్తబంధం వినాశయేత్।
అహం బ్రహ్మోఽస్మి మంత్రోఽయం
చిత్తవృత్తిం వినాశయేత్।
అహం బ్రహ్మోఽస్మి మంత్రోఽయం
సంకల్పాదీన్వినాశయేత్।
అహం బ్రహ్మోఽస్మి మంత్రోఽయం
కోటి దోషం వినాశయేత్।
అహం బ్రహ్మోఽస్మి మంత్రోఽయం
కామాదీన్నాశయేత్ క్షణాత్।

'అహం బ్రహ్మోఽస్మి' (నేను బ్రహ్మమునే అయియున్నాను) అను ఈ మంత్రము బుద్ధివ్యాధిని తొలగించును. చిత్తబంధమును నివారించును. చిత్తవృత్తులను నశింపజేయును, సంకల్పాదులను తొలగించును. అనేక దోషములను పరిహరించును. క్షణకాలములో కామాదులన్నిటిని లెస్సగ నశింపజేయును.

OO

No perfection is going to. already perfect.

మోక్షమును క్రొత్తగా పొందుటకాదు, మానవుడు మోక్షస్వరూపుడే అయియున్నాడు.

# సిద్ధగీత

పరిత్యజ్యహృద్గుహావాసం దేవమన్యం ప్రయాన్తియే

తేరత్నమభివాఞ్ఛన్తి త్యక్త హస్త స్థ కౌస్తుభాః

తమ హృదయ గుహాయందున్న పరమేశ్వరుని వదలి ఇతర దేవతల నెవ రాశ్రయించుదురో అట్టివారు తమ చేతియందున్న కౌస్తుభమణిని పారవైచి ఇతర రత్నములను కోరువారేయగుదురు.

సర్వాశాః కిలసంత్యజ్య ఫలమేతదవాప్యతే

యేనాశా విషవల్లీనాం మూలమాలావిలూయతే

కోరికలన్నిటిని లెస్సగ పరిత్యజించినపుడే హృదయ గుహాయందున్న ఆత్మ యను ఫలము లభించుచున్నది. మఱియు ఇట్టి ఆత్మప్రాప్తిచే ఆశలను విషపుతీగెలు సమూలముగ (వాసనాసహితముగ) ఛేదించివేయబడుచున్నవి.

బుద్ధ్వాప్యత్యన్తవైరస్యం యః పదార్థేషు దుర్మతిః

బధ్నాతి భావనాంభూయోనరోనాసౌసగర్దభః

పదార్థములందలి అత్యంత నీరసత్వము (సారహీనత్వము) నెఱిగియు ఏ దుర్బుద్ధి మరల వానియందు ఆశ గలిగియుండునో అట్టివాడు మనుష్యుడు కాదు గాడిదయే యగును. ○○

Help the hungry people with food, the naked with cloth, the poor with money, and the fallen with spirit.

ఆకలిగొన్నవానికి అన్నమిడుము. దిగంబరులును, అర్ధ నగ్నశరీరులగు దీనులకు వస్త్రములను సహాయము చేయుము. బీదవారికి ధనసహాయము గావింపుము. అజ్ఞానులకు జ్ఞానమును ప్రసాదింపుము!

సీరియల్

# జనమేజయ మహారాజు – 1

## ఈశ్వర్

ఒకనాటి చరిత్రను గతచరిత్ర అంటారు. అట్టి గత చరిత్రను సాంగోపాంగముగ అందించుటకు రచయితలు పూనుకుంటుంటారు. అట్టి పురాతన రచయితలలో ముఖ్యులు వేదవ్యాసమహర్షి. వారు అనేక చారిత్రాత్మక చరిత్రలు మనకందించారు. వాటిలో ముఖ్యమైనది మహాభారతము. అట్టి మహాభారతములో ఒక భాగమైన జనమేజయ వృత్తాంతమును గురించి కొద్ది తెలుసుకొందాము.

పరీక్షిన్మహారాజు కుమారుడయిన జనమేజయ మహారాజు ఒకనాడు సభాభవనములో సింహాసనాసీనుడై తన పురోహిత, మంత్రి, సామంత, బంధువర్గ సపరివార సమేతముగా ఏవేవో సమాలోచనలు చేయుచుండెను. ఆకస్మికముగ ఒక ద్వారపాలకుడు వేగమున వచ్చి "మహారాజా ఎవరో ఒక భూసురోత్తముడు తమ దర్శనం కొరకు వేంచేసియున్నాడ"నెను. "వెంటనే వారిని లోపలికి పంపించు" అని ఆజ్ఞాపించాడు జనమేజయ మహారాజు. అలాగే అన్నాడు ద్వారపాలకుడు.

మహాతేజశ్శాలియైన ఒక బ్రాహ్మణోత్తముడు లోనిగి రాగానే రాజు రెండు చేతులను జోడించుకొని భక్తిపూర్వకముగ నమస్కరించి అర్ఘ్యపాద్యాదివిధులతో ఆ బ్రాహ్మణుని పూజించి :

"మహాత్మా! తమరు ఎవరు? ఏ కార్యార్థమై ఇక్కడికేతెంచారు? పవిత్రమైన మీ పాదపద్మాల స్పర్శతో మా సభాభవనం పునీతమైంది. తమ రాకకు కారణం సెలవివ్వండి" అన్నాడు జనమేజయ మహారాజు.

"రాజా! నా పేరు ఉదంకుడు. నా రాకకు కారణం అడిగారు. చెప్తున్నాను వినండి" అని ప్రారంభించాడు ఆ బ్రాహ్మణోత్తముడు.

"ఒక నీచుడు అహంకారముతో గర్వముతో నిష్కారణంగా నాకు అపకారం చేశాడు. అంతేకాదు ఆ పాపాత్ముడు విశ్వవిఖ్యాతమైన చంద్రవంశానికి వెలుగురేఖయై

వెలిగిన నీ తండ్రియగు పరీక్షిన్మహారాజును క్రూరమైన విషాగ్నులతో కాల్చి చంపాడు" అని క్లుప్తంగా ముగించాడు ఆ వచ్చిన విప్రుడు.

"తుంటరితనం తలకెక్కిన ఆ పొగరుబోతు ఎవరో తెలియచేయండి హరి హర బ్రహ్మాదులు అడ్డుకున్నా, అనంత ప్రకృతి మహాశక్తులు ప్రతిఘటించినా అతనిని విడవను. అతనిని నిలువునా చీల్చి రక్తధారలను దోసిటపట్టి నా తండ్రికి తర్పణం విడుస్తాను. చెప్పండి స్వామీ ఎవడా పాపిష్ఠి కిరాతకుడు" అని జనమేజయుడు కోపముతో ఊగిపోతూ ప్రశ్నించాడు.

"ఆ పాపిష్ఠి జన్మడు తక్షకుడు" అని ముక్తసరిగ చెప్పి మౌనము వహించాడు ఉదంకుడు.

జనమేజయుడు పండ్లు కొరుకుతూ సభాభవనము అంతయూ కలియ చూచి "ఈ విషయము ఎందుకు ఇంతకాలము దాచావు?" అని మహామంత్రిని అడిగాడు.

అందుకు సమాధానముగా—"చిరంజీవి! నీ పసితనములో జరిగిన ఈ దారుణ సంఘటనను నీకు తెలియచేసి నీ మనస్సును కృంగదీసి అశాంతి చేయవద్దని నీ తల్లియగు ఐరావతీదేవి మాకు అప్పట్లో ఆజ్ఞాపించారు. ఈ బ్రాహ్మణుడు చెప్పింది యథార్థమే! శృంగి అనే మునిబాలుడు శపించిన కారణంగా తక్షకుడే నాన్నగారిని కాటువేసి చంపాడు" అన్నాడు మహామంత్రి.

"సాటిలేని మేటి పరాక్రమవంతుడైన నా తండ్రిని ఒక సామాన్యక్షుద్ర సర్పం వంచనచేసి దారుణమైన దుర్మరణానికి పాల్పడచేసిందన్న బాధ నా హృదయంలో రంపపుకోతయై హింసిస్తుంది. ఈ అపకారానికి ప్రతీకారము చేయనిదే నా మనస్సు శాంతించదు. నా తండ్రి ఆత్మకూడ సంతుష్టి చెందదు. ఆ విషయం తర్వాత నిర్ణయించుకుందాం. ముందు నా తండ్రి అకాలమరణ గాథను వివరంగా తెలుసుకో దలచినాను" అన్నాడు జనమేజయుడు మహామంత్రితో.

మహామంత్రి గొంతును సరిచేసుకొని చెప్పుటకు ఉపక్రమించాడు. జనమేజయునితో పాటు ఉదంకుడు సభికులు ఆ గాథను వినుటకు చెవులను సరిచేసుకొని ఉత్కంఠులై వున్నారు.

**(సశేషం)**



# ప్రశ్నోత్తర వేదిక ?



## సందేహాలు - సమాధానాలు

డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్యులు గారు M.A.,Ph.D.
(తిరుపతి)

**ప్రశ్న :** *లోకంలో మనం విభిన్న మనస్తత్వాలు ప్రవృత్తులు కలవాళ్లని చూస్తుంటాం కదా! దైవీసంపదలో పుట్టినవాళ్లు ఎలా ఉంటారు? వారిలో ఎలాంటి గుణగణాలుంటాయి?*

**జవాబు :** భయం లేకపోవడం, సత్వగుణం కలిగి వుండడం, జ్ఞానయోగవ్యవస్థ, దానం, ఇంద్రియనిగ్రహం, దైవారాధన, జ్ఞానసముపార్జన, తపస్సు, కపటం లేకపోవడం, అహింస, సత్యభాషణం, కోపం లేకపోవడం, త్యాగం, శాంతి, మొండితనం లేకపోవడం, జీవులందరిపై దయ, విషయాలలో వ్యసనం లేకపోవడం, మృదుస్వభావం, వినయం, చిత్తచాపల్యం లేకపోవడం, తేజస్సు, ఓర్పు, ధైర్యం, శరీరానికి మనస్సుకు సంబంధించిన పరిశుద్ధి, ద్రోహచింత లేకపోవడం, తాను చాలా కులీనుడననో, ధనికుడననో, అందగాడిననో, విద్యావంతుడననో, బలవంతుడననో దురభిమానం లేకపోవడం, ఇవన్నీ దైవీసంపదలో పుట్టినవారికుండే సహజగుణాలు. అందువల్లనే వారి ప్రవృత్తి దివ్యంగా వుంటుంది. ఆదర్శంగా వుంటుంది. మనదేశ చరిత్రలో చిరస్థాయిగా నిలబడ్డ మహాపురుషుల్లో ఈ గుణాలను మనం చూడవచ్చు.

అభయం సత్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ । (భగవద్గీత 16-1)

**ప్రశ్న :** *కొందరు పలకరిస్తే కరవాస్తారు. వారి గొప్ప తప్ప ఇంకొకరి మాట చెవిపెట్టరు. వీరు ఏ సంపదలో పుట్టినవారు? వారి గుణాలేమిటి?*

**జవాబు :** వారే ఆసురీసంపదలో పుట్టినవారు. వారు డంబాచారాలకు, ఆడంబరాలకు, గర్వానికి, దురభిమానానికి, కోపానికి, దురుసుగా మాట్లాడడానికి, అజ్ఞానానికి పుట్టిల్లులాంటివారు. వారు చెప్పేది తప్ప ఇంకోమాట చెవిని వేసుకోరు. వారు సుఖంగా బ్రతకరు. ఇతరులను సుఖంగా బ్రతకనివ్వరు.

దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్ ॥ (భగవద్గీత 16-4) ○○




# సింహాచలము

ఓంప్రకాశ్

ఆంధ్రప్రదేశ్‌లోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలలో ఇదొకటి. ఈ క్షేత్రంలో శ్రీ వరాహ-లక్ష్మీనృసింహస్వామి విరాజిల్లి ఉన్నాడు.

## మార్గం

వాల్తేరు స్టేషన్‌లో దిగాలి. వాల్తేరు నుండి ఐదు మైళ్ల దూరంలో సింహాచలం స్టేషనుంది. ఆ సింహాచలం స్టేషను నుండి రెండున్నర మైళ్ల దూరం వెళితే సింహాచల పర్వతం వస్తుంది.

## క్షేత్ర దర్శనం

సముద్ర తలానికి 800 అడుగుల ఎత్తున సింహాచలం ఉంటుంది. విశాఖపట్టణానికి ఉత్తరంగా పది మైళ్ల దూరంలో ఈ క్షేత్రం ఉంది. అక్కడనుండి బస్సులద్వారా ఈ క్షేత్రానికి రావచ్చు.

సింహాచలం పైకి ఎక్కటానికి మెట్లున్నాయి. మెట్లు ఎక్కుతుంటే అలసిపోయే యాత్రీకుల విరామం కోసం, మధ్య మధ్యలో కూర్చునే మంటపాలు కట్టారు. సింహాచలం పర్వతం క్రింద-పైనా కూడా సత్రాలు దొరుకుతాయి.

సింహాచలం పర్వతం పైన ఆలయంలోకి వెళితే, ఒక విగ్రహం కనబడుతుంది. అది వరాహమూర్తిలా ఉంటుంది. కానీ, దానినే నృసింహస్వామి అంటారు. ఈ స్వామి విగ్రహాన్ని పన్నెండు నెలలు కూడా గంధంతో పూసి ఉంచుతారు. వైశాఖ మాసంలో, అక్షయ తృతీయ రోజున గంధాన్ని తీసివేస్తారు. ఆ రోజు మాత్రమే స్వామి నిజ

స్వరూపాన్ని చూడవచ్చు. ఆ నిజస్వరూపాన్ని దర్శిస్తే, ఆ భక్తులకు నిశ్చయంగా ముక్తి కలుగుతుందని అంటారు.

ఆలయం చుట్టూ ఉన్న ప్రహరీలో గోపురాలు కనబడతాయి. ముఖమండపాన్ని దాటిన తర్వాత పదహారు స్తంభాల మండపం కనబడుతుంది. ఈ మండపంలో సుందరమైన రాతి రథం ఒకటుంది. నల్లని రాతిలో అద్భుతంగా చెక్కారు. రకరకాల ఆ భూషణాలను కూడా ఎంతో సున్నితంగా చెక్కియున్నారు. ఆ రథానికి రెండు రాతి గుఱ్ఱాలనుకూడా శిల్పీకరించారు. అవి ఆ రథాన్ని లాగుతున్నట్లుగా ఉంటాయి.

ఆలయానికి ఉత్తర దిశలో కళ్యాణ మంటపం కనబడుతుంది. చైత్రశుక్ల ఏకాదశి రోజున, ప్రతి సంవత్సరం కూడా ఈ మంటపంలో స్వామివారి కళ్యాణోత్సవం జరుగుతూ ఉంటుంది. ఆ సమయంలో మంటపంలో విష్ణుమూర్తి అవతారాలైన మత్స్య, ధన్వంతరి, వరుణ, నృసింహస్వాముల విగ్రహాలను ఇతర దేవతల విగ్రహాలను పెడతారు.

ఈ పర్వతం మీద ఒక జలపాతం ఉంది. దానిని 'గంగాధర' అంటారు. యాత్రికులు ఈ జలపాతం నీటిలో స్నానం చేస్తుంటారు. ఆలయంలో కూడా ఈ నీటినే ఉపయోగిస్తుంటారు.

అక్షయ తృతీయనాడు తప్ప, మిగతా రోజులలో, స్వామిని చందనంతో అలంకరిస్తూ ఉంటారు. అప్పుడు, ఆ విగ్రహం, ఒక పెద్ద గుండ్రని చందన స్తూపంలా కనబడుతూ ఉంటుంది. యాత్రికులు ఆ చందన మండిత విగ్రహాన్నే పూజిస్తారు. దర్శనం చేసుకుంటారు. ఆలయంలోకి రావటానికి, ప్రవేశ రుసుము కట్టి టికెట్లు తీసుకోవాలి.

హిరణ్యకశిపుడు, కుమారుడైన ప్రహ్లాదుడిని సముద్రంలో పడవేయించి, ఆ పిల్లవాడిమీద ఈ పర్వతాన్ని పెట్టిస్తాడు. అయితే విష్ణుభగవానుడు, తన ప్రియ భక్తుడిని రక్షించటం కోసం ప్రత్యక్షమై స్వయంగా ఈ పర్వతాన్ని ధరిస్తాడు. అప్పుడు ప్రహ్లాదుడు ఆ స్వామిని పూజిస్తాడు. ప్రహ్లాదుని రక్షించే నిమిత్తం ఎత్తిన అవతార స్వరూపమే, సింహాచలంలోని భగవత్ స్వరూపం.

ఈ క్షేత్రానికి అనేకమంది యాత్రికులు వస్తూ, స్వామివారిని దర్శనంచేసుకుంటూ ఉంటారు.

OO

# సద్గురు [illegible]

## శ్రీ మహర్షి మలయాళస్వాములవారు

1. ఎంత గొప్పవారైనను తాము ఏ విద్యగాని, పనిగాని నేర్చుకొనుటకు ఉద్యమించినచో యెవరిదగ్గఱనుండి నేర్చుకొనవలసియుండునో అట్టివారు యెంత తక్కువవారైనను, వారు చెప్పేలాగున వినమ్రులై యుండవలెను. అదెట్లన? క్షౌరము చేయుసమయమున చక్రవర్తిగాని, జగద్గురువు అయినను మంగలి చెప్పేలాగున శిరస్సు, ముఖము మొదలగు నుత్తమాంగములను కూడా త్రిప్ప వలసియుండునుగదా? కావున కార్య సాఫల్యము కొఱకు ఎంత చిన్న స్థితిలో నుండువాని సలహానైనను అనుసరించుకొనవలయును.

2. కొన్ని స్థలములలో గొప్ప కుటుంబమున పుట్టిన మంచి వయస్సులోనుండు కొందరు స్త్రీలనుగాని, పురుషులనుగాని, గ్రహము ఆవేశించి యుండును. కొన్ని సమయములలో మాంత్రికుడు గ్రహోచ్చాటనము గావించినను పోనిచో బెత్తముతో కొట్టుటయు, నీచముగా తిట్టుటయుగూడ గలదు. ఆలాగున కొందరు గురువులు కొన్ని సమయములలో శిష్యులకు గుణము మంచిదిలేనిచో, ఆ దోషము నివృత్తి చేయవలెనని తలంచుటచే, పై మాంత్రికుని కృత్యమవలంబింతురు. మంత్రగాడు అట్లు చేయుట గ్రహావిష్టమనుజులలో గల ద్వేషముచేగాదు, గ్రహముపైగల ద్వేషమేయగును. ఆలాగున గురువులుగూడ ప్రకృతి గుణములుగల శిష్యులను అనగా భక్తులను సంస్కరించుట వారిపైగల విరోధము చేతగాదు. బాగుపడవలెనని విశ్వాసముతో జేయుదురు. వారు తమ ఆత్మవలె శిష్యులనుగూడ పరిశుద్ధులుగా జేయవలెనని తలంపుతో జేయవలయును. అట్లైన మాత్రమే ప్రకృతి స్వభావమగు దయ్యము వీరిని వదలిపోవును.

3. నిప్పు పుల్లలో నిప్పు నిండుగా యుండినను, నీటిలో తడిసియుండిన యెన్ని సార్లు గీచినను మండని చందమున హృదయమందు భగవత్కళ నిండి వెల్గు చుండినను, విషయ విరక్తి గల్గువరకు ఎంత ధ్యానించినను, ప్రార్థించినను

ఆత్మదర్శనము గలుగదు.

4. దైవమునకును, దయ్యమునకును, ఉత్తర ధ్రువ దక్షిణ ధ్రువముల దూరము గలదు. దైవగుణముగలవాడు దైవత్వము నొందును. దయ్యపు గుణముగలవాడు దయ్యమునే చెందును.
5. మనుష్యుల ప్రేమ రెండు విధములుగా గలవు. అవి మలిన ప్రేమయనియు, శుద్ధ ప్రేమయనియు గ్రహించవలయును. ఆ మలిన ప్రేమలో నికృష్టమనియు, శ్రేష్ఠమనియు ఇరు తెగలు గలవు. నికృష్ట ప్రేమ కేవలము విషయాసక్తులైనవారి నీచస్వభావమై యుండును. అది మొదటినుండి లోపల నీచభావముగానే యుండును. అది ఇచ్చట వచించుటకు గూడ యోగ్యమైనదిగాదు.

   రెండవదైన శ్రేష్ఠ ప్రేమ స్వబంధువులు, స్వధనము మొదలైనవానియందు గలుగుచుండును. నికృష్ట ప్రేమ నరకమును, ఈ శ్రేష్ఠ ప్రేమ బంధమును గలుగచేయును. శుద్ధ ప్రేమ, మలినశుద్ధ ప్రేమయనియు, విశుద్ధ ప్రేమయనియు ఇరు తెగలుగా నుండును. మలినశుద్ధ ప్రేమ, మోహమై పరిణమించి, విషయరూపమై మారును. అనగా కామరూపమై పరిణమించును. విశుద్ధ ప్రేమ తనలోను, ప్రేమించబడు వారిలోను, తన ఆత్మమయమై లేక దైవమయమై లేక దృక్కును, దృశ్యమును, ఏకమయమై మారుచుండును. ఇట్టి ప్రేమ జీవన్ముక్తునికి మాత్రమే గలుగును.

   ఒక్కరిలోగల భక్తిగాని, శాంతముగాని, కరుణగాని, జ్ఞానముగాని గలిగియుండుదానిపై గలిగెడు ప్రేమ మలినశుద్ధ ప్రేమయని గ్రహించవలయును. ఏలన, ఇది త్రిగుణములతో సంబంధించినది. పై జెప్పిన విశుద్ధ ప్రేమ గుణత్రయాతీతమైనది. ఈ ప్రేమకు వికారము గలుగదు. అదే దీనికి గురుతు. ఏ ప్రేమ వికారమును గలుగచేయునో, అది గుణములతో గూడినది. ఇట్టి ప్రేమ నియమమున కధికముగా నొక్కరిలో చూపకూడదు. ఇది సాధకుడు స్వానుభవముచే గనుగొనవలయును. అయితే మలిన ప్రేమ బద్ధులకును, శుద్ధ ప్రేమ భక్తులకును గల్గుచుండును. OO

Acts speak louder than words.

మాటలకంటె చేష్టలు బిగ్గరగా మాట్లాడగలవు.

# సృష్టిలోని వింతలు - విశేషాలు

1) అమెరికాలోని అలాస్కా పైపు లైను ప్రపంచములో మిక్కిలి పెద్దది. దీని పొడవు 1,276 కిలోమీటర్లు. దీని గుండా రోజుకి 20 లకల పీపాల ముడి నూనె పంపబడుచుండును.

2) ప్రపంచములో లిపిగల భాషలు మొత్తం 2,796. లిపిలేని భాషలు ఇంకెన్నియో కలవు.

3) యురేనస్ గ్రహము ఒకసారి సూర్యుని చుట్టి వచ్చుటకు 84 సంవత్సరములు పట్టును.

4) ప్రతి దినము మానవుని గుండె 1 లక్ష 3 వేల సార్లు కొట్టు కొనును. ప్రతి రోజు రక్తము 1 లక్ష 68 వేల మైళ్లు ప్రవహించును. ప్రతి రోజు మనుష్యుడు 23 వేల సార్లు ఊపిరి పీల్చు కొనును. మఱియు 438 ఘనపుటడుగుల గాలిని పీల్చును.

5) నక్షత్రములన్నియు బ్రహ్మాండమైన వేగముతో పయనించు చున్నవి.

6) రష్యాలో డ్నీస్టర్ నదీ తీరమందు ఒక పెద్ద పండ్ల తోట కలదు. అది 12 కిలోమీటర్ల పొడవు, 15 కిలోమీటర్ల వెడల్పు కలిగి సంవత్సరమునకు 70 వేల టన్నుల ఆపిల్ పండ్లను సృష్టి చేయుచున్నది.

7) యురేనస్ గ్రహము భూమికంటె పెద్దది. దీని చుట్టూ 5 ఉపగ్రహములు తిరుగుచున్నవి. OO

# 66వ సనాతన సభలో

# శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారి సందేశము

## (19.3.92)

సేకరణ: శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారు (తిరుపతి)

పూర్వం నైమిశారణ్యంలో పన్నెండు సంవత్సరాలు సత్త్రయాగం జరిగింది. వాతావరణం ప్రశాంతంగా వుంటేనే అలాంటి కార్యక్రమాలు నిర్విఘ్నంగా జరుగుతాయి. ఇక్కడ కూడా అలాంటి వాతావరణమే ఉన్నది.

మనస్సును బహిర్ముఖంగా పోనీకుండా అంతర్ముఖం చేయాలి. '**తద్బుద్ధయస్త దాత్మానః**' అన్న రీతిగా తదేక ధ్యానంతో ఉండాలి. పాఠశాలలో థియరీ, ప్రాక్టికల్ క్లాసులు రెండూ వుంటాయి. అక్కడ ప్రయోగశాలలో తరగతిలో చెప్పినదానిని నిరూపించి చూడడం జరుగుతుంది. ఆధ్యాత్మిక సాధనలో కూడా వేదాంత వచనాలు పలికినంత మాత్రాన చాలదు. అనుభూతి సాధించాలి. శ్రవణంతో పూర్తిచేయరాదు. సత్యం పలకాలి. ధర్మం ఆచరించాలి. దేనికైనా ఆచరణలో పెట్టడానికి కొంత సమయం పడుతుంది. పూర్వ సంస్కారాలు అడ్డు వస్తాయి. అయినా ఓపికతో సాధింపదగిన లక్ష్యాన్ని సాధించాలి.

భగవంతుని పొందాలని అందరికీ తెలుసుగదా! ఎందుకు పొందలేకపోతున్నారు? దొంగతనం తప్పని దొంగకు తెలుసు. అయినా ఆ పని చేస్తూనేవుంటాడు. కారణమేమి?

అర్జునుడు శ్రీకృష్ణుని "**అథకేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః?**" -"దేని ప్రేరణవల్ల మనుజుడు పాపం చేస్తున్నాడు?" అని ప్రశ్నించాడు. బలవత్తరమైన వాసనల ప్రేరణతో అలా జరుగుతున్నదని భగవంతుడు బదులు చెప్పాడు.

[illegible]

[illegible]

రజోగుణంవల్ల కలిగిన కామక్రోధాలు మానవునకు శత్రువులుగా ఉన్నాయి. అగ్నిని పొగ కప్పివేస్తుంది. మాలిన్యం అద్దాన్ని ఆవరిస్తుంది. అప్పుడది ప్రతిబింబించే

శక్తిని కోల్పోతుంది. మనం అద్దానికి ప్రతిబింబించే శక్తిని కలిపించనక్కరలేదు. అడ్డును తొలగిస్తే చాలు. మావిలోని బిడ్డ సంగతి కూడా ఇంతే. జనులకు అనేక జన్మలలో పాడు సంస్కారాలు కలిగాయి. అవి అడ్డు వచ్చి ఆత్మోన్నతి కలగనీకుండా చేస్తున్నాయి. ఈ ఆటంకాన్ని అధిగమించటానికై కృషి చేయాలి.

చేయరాని పనులెందుకు చేస్తున్నారని ఒకరు దుర్యోధనుణ్ణి అడిగితే ఆయన ఇలా సమాధానం చెప్పాడు-

[illegible]
[illegible]
[illegible]
[illegible]

'నాకు ధర్మం తెలుసు. అయితే చేయబుద్ధికావడంలేదు. పాపం తెలుసు. వదలబుద్ధికావడంలేదు. ఏదో శక్తి నా హృదయంలో దూరింది. అది నియమించినట్లు నేను చేస్తున్నాను" పూర్వ జన్మ గత పాప సంస్కారాలు ఈ పని చేస్తాయి. అంతేకాని ఎవరో వచ్చి మరొకరి హృదయంలో దూరరు.

ఈ మానవ జన్మలో కూడా అమూల్యావకాశం వదలి చేయరాని పనులు చేసి పాపం మూటకట్టుకొంటున్నారు అని జ్ఞాపకం చేయడానికే ఈ సభలు ఏర్పడ్డాయి. పుణ్యధనం దొంగిలించేవారు హృదయంలో చేరారు. [illegible] 'ఈ కామక్రోధాదులైన దొంగలు జ్ఞానరత్నాన్ని అపహరిస్తున్నారు. వీరిని తరిమివేయాలి.

సనాతనాత్మ అందరిలోనూ వున్నది. 'దేవుణ్ణి చూచాను' అని రామకృష్ణ పరమహంస ఘంటాపథంగా చెప్పారు. గోడను చూచినట్లు ప్రత్యక్షంగా చూస్తున్నానని ఆయన అన్నారు. అయితే దేవుడంత చవుకగా లభించడు. అందుకు తగిన మూల్యం చెల్లించాలి. త్యాగమే ఆ మూల్యం. [illegible]"-త్యాగంచేతనే అమృతత్వం లభిస్తుంది.

దృశ్యభావన త్యజించాలి. ఆత్మ-అనాత్మ అనేవి రెండే వున్నవి. మానవుడు ఆత్మస్వరూపుడే కాని అనాత్మస్వరూపుడు కాడు. మనం నశించే వస్తువులము కాము. ఈ జగమంతా ఆత్మలో మనస్సుచే కల్పితమయి వున్నది. రాత్రివేళ గాఢ నిద్రలో మనస్సు లయిస్తే జగత్తు నశిస్తున్నది. మేలుకొన్నప్పుడే దాన్ని నశింప జేయాలి. ప్రతి దినం దానికై సమయం కేటాయించాలి. బ్రహ్మముహూర్తంలో ధ్యానమననాలుచేసి 'నేను ఆత్మస్వరూపుణ్ణి' అని భావించాలి. ఈ శరీరం పతనంకాక ముందే దీనిని సాధించాలి. OO

# వినోదము-వికాసము

## మదం పోగొట్టుకో, దమం రాబట్టుకో!

ఒక ఊళ్ళో పండితులంతా కూడి ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసుకున్నారు. ఆ పండిత సభకు ఒక సాధుమహాత్ముని ఆహ్వానిస్తే బాగుండునని తలంచారు. విద్య, తపస్సుగల ఒకానొక మహనీయుని ఆశీస్సులు పొందితే తమ పండిత పరిషత్తుకు ఎంతో బలం చేకూరగలదని వారు భావించారు. వారి గ్రామానికి అనతి దూరంలో ఒక ఆశ్రమము ఉంది. ఆ ఆశ్రమంలో ఒక సాధుమహాత్ముడు నివసిస్తున్నాడు. అతడు విద్యా తపస్సుల రెండిటిలో ఆరితేరినవాడు. ఆధ్యాత్మిక అనుభూతి కలవాడు. అందుచేత పండితులు తమ సభకు ఆ తపస్విని ఆహ్వానించిన మంచిదని తలంచి వారి చెంతకేగి తమ అభీష్టాన్ని తెలియజేశారు. సాధుమహాత్ముడు అందులకు అంగీకరించి సభాస్థలికి పయనమై వెళ్ళారు.

పండితులందరు గౌరవ మర్యాదలతో ఆ సాధుపుంగవుని ఆహ్వానించి లోనికి తీసుకొనివెళ్ళి ఉన్నతాసనముపై కూర్చుండబెట్టారు. పరిషత్ సంబంధమైన కార్య కలాపాలన్నీ పూర్తయిన పిదప, పండితులందరు సాధుమహాత్మునితో తమ ఆశీస్సులు అందజేయవలసిందిగా ప్రార్థించారు.

అప్పుడు మహాతపస్సంపన్నుడగు ఆ సాధుపుంగవుడు పండితులకిట్లు బోధించారు-"పండితోత్తములారా! పాండిత్యమనగా కేవలం సాహిత్య ప్రావీణ్యమే కాదు. పవిత్ర హృదయము, నిష్కల్మష చరిత్ర, ఇంద్రియ నిగ్రహము, మనోజయము, పరోపకార స్వభావము మున్నగు ఉదాత్తగుణములను కలిగియుండుటయే యథార్థ మైన పాండిత్యము. కాబట్టి మీరందరు మీ సాహిత్య ప్రవీణతతో పాటు 'దమ'ము (ఇంద్రియ నిగ్రహము)ను కూడ కలిగియుండుడు. దమము యొక్క చేరికచే

మీ సాహిత్య లోకము ఇంకను చక్కగ శోభించును. అట్టి దమము యొక్క ఆచరణచే మీ అక్షరజ్ఞానము సఫలమై మీకు 'సాక్షరాః' (అక్షరజ్ఞానముతో కూడినవారు) అను బిరుదు లభిస్తుంది. మీ సాహిత్యలోకము ఇంకను చక్కగ శోభించును"–సాధు మహాత్ముని ఈ వాక్యాలను పండితులు విని సభకు ఉపసంహరించి వారి వారి నెలవులకు వెళ్ళిపోయారు. సాధువు గారు వారి ఆశ్రమానికి పయనమై పోయారు.

సాధుమహాత్ముడు 'దమ'మును అభ్యసించమని బోధించినప్పటికిని పండితులు వారి వాక్యాన్ని ఆచరణలో పెట్టలేదు. పైగా 'దమ'మను పదానికి స్వస్తి చెప్పి దాన్ని తల్లక్రిందులు చేసి 'మద'మును అలవాటు చేయసాగారు. ఈ విషయం సాధుమహాత్ముని చెవిలో పడింది. ఆ సాధుపుంగవుడు మరొక సందర్భంలో పండితుల ఆహ్వానంపై వారి సమావేశానికి వచ్చి–"ఓ పండితులారా! నేను మీకు బోధించిన 'దమ'మును మీరు తల్లక్రిందులు చేసి 'మద'మును అలవాటుచేసుకొన్నచో మీకు వచ్చే 'సాక్షరాః' అను బిరుదు కూడ తల్లక్రిందులై 'రాక్షసాః' (రాక్షసులు) అని మారిపోగలదు సుమా!" అని హెచ్చరించారు.

పండితులు ఆ మహనీయుని హెచ్చరికను ఆలకించి తమ తప్పిదాన్ని తెలుసుకొని, అప్పటినుండి తమ పాండిత్యంతో పాటు దమాన్ని కూడ అనగా ఇంద్రియ నిగ్రహాన్ని కూడ చక్కగా అభ్యసించి అభివృద్ధిని పొందసాగారు. దానిచే వారందరు పవిత్ర హృదయులై దైవానుగ్రహమునకు పాత్రులై పరమశాంతిని పొందారు.

కావున జీవుడా! పాండిత్య ప్రకర్ష కలిగియున్నప్పటికి, శాస్త్రాధ్యయనము కావించుచున్నప్పటికి సచ్చరిత్రను కలిగియుండు. దమమును అభ్యసించు. పవిత్ర హృదయానికి తావియ్యి. ఇంద్రియాలను అదుపులో పెట్టు. మనస్సును స్వాధీనం చేసుకో. అప్పుడు జీవితం శోభాయమానమై వెలుగుతుంది! నీకు శాంతి కలుగుతుంది!! ఆనందం పొంగి పొరలుతుంది!!! జై గురుదేవ్.

సాక్షరాణాం దమో యస్స్యాదష్టాదశ గుణాన్వితః
ప్రాతికూల్యే తు దోషస్స్యాత్ రాక్షసానాం మదం విదుః

OO

**Weakness is the cause of suffering**

**దుర్బలత్వమే దుఃఖమునకు ఏకైక కారణము.**

# దివ్యౌషధము

ఎటువంటి ప్రజ్ఞాశాలియగు వైద్యుడైనను, అతడు ప్రయోగించినది ఎంతటి శక్తివంతమైన ఔషధమైనను ఔషధ సేవనానంతరము రోగి యొక్క పరిస్థితిని వైద్యుడు విచారించియే తీరును. శ్రీకృష్ణుడున్ను అట్లే కావించెను. అర్జునునిచే గీతామృతమను భేషజమును పానము చేయించిన తదుపరి–'ఓ అర్జునా! ఈ గీతాజ్ఞానౌషధముచే నీ యొక్క అజ్ఞానసమ్మోహరోగము నశించినదా?' అని ప్రశ్నించెను.

తత్క్షణమే అర్జునుడు 'నష్టోమోహః' – 'మహాత్మా! మీ యనుగ్రహముచే నా అవిద్య నశించినది. ఆత్మజ్ఞానముదయించినది. సందేహములన్నియు తొలగి పోయినవి. ఇక మీ యాజ్ఞ నెరవేర్చెదను' అని హర్షోత్ఫుల్లమానసుడై ప్రత్యుత్తరమిచ్చెను. భగవానుడు ప్రయోగించినది చక్కని చిట్కా, కాలాంతరమున నెపుడో ఆరోగ్యమును కలుగజేయునది కాదు అది. సేవించిన తత్క్షణమే సద్యఃఫలితమును గలుగజేయునది. కలుగజేసినది కూడను.

అర్జునుడే అందులకు నిదర్శనము, వైద్యుని తొలి ప్రయోగమే సఫలమైనది. కావున ఇక మందు విషయమై ఎవరికిని ఏ విచికిత్స అవసరము లేదు. రెండు చేతులతో దానిని పరిగ్రహించి ఇండ్లకు తీసుకొని వెళ్ళ వచ్చును. అర్జునునకు రోగము నయమైనపుడు ఇక ఎవరికి మట్టుకు నయము కాదు? ఒక చోట ప్రయోగము (experiment)సఫలమైనపుడు, అన్ని చోట్ల కూడ అది సఫలమైయే తీరును. ఇందు ఏమాత్రమున్ను సంశయము లేదు.

కావున సర్వ మానవకోటి, కాదు, దేవకోటి, అసురకోటి కూడ గీతారూపమగు ఈ అనుపమ దివ్యౌషధమును సేవించి, భవరోగమును బాపుకొని శాశ్వత సౌఖ్యమును బడయుముగాక!

గీతాధ్యయనమును, గీతానుష్ఠానమును ఎవరు కావించెదరో, వారు మహత్తరమగు 'జ్ఞానయజ్ఞమును' ఆచరించినవారేయగుదురు. సామాన్య యజ్ఞములకే ఎంతయో గొప్ప ఫలితము నిర్దేశింపబడియుండ ఇక జ్ఞానయజ్ఞ విషయమై వేఱుగ జెప్ప వలయునా! అన్ని లాభములకంటె గొప్ప లాభము, అన్ని పదవులకంటె గొప్ప పదవి, అన్ని సంపదలకంటె గొప్ప సంపద జ్ఞానయజ్ఞము నాచరించినవానికి సిద్ధించును. నిస్సంశయముగ వానికట్టి మహోచ్ఛదశ సంప్రాప్తించియే తీరును. ఏలయనిన జ్ఞానయజ్ఞాచరణముచే నతడు ఇక నరుడుగా నుండక నారాయణుడుగ రూపొందును. భక్తుడుగ నుండక సాక్షాత్ భగవంతునితో నైక్యమొందును.

OO

## సోమరి శిష్యుడు

**గురువు :** దాసూ! నా విభూతిబరిణె ఎక్కడున్నది?

**శిష్యుడు :** స్వామీ! సాలగ్రామముల దగ్గఱున్నది.

**గురువు :** సాలగ్రామములెక్కడున్నవి?

**శిష్యుడు :** విభూతిబరిణె దగ్గఱున్నవి.

**గురువు :** ఏమిరోయ్! తలబిరుసు మాటలు? పోయి ఆ బరిణె తీసుకొనిరా?

**శిష్యుడు :** స్వామీ! తమకు అది యెప్పుడు అవసరము?

**గురువు :** రేపు తెల్లవారిజామున విభూతి పెట్టుకొని గీతాపారాయణకు వెళ్ళ వలెను గదా?

**శిష్యుడు :** ఓహో, పొద్దునకా! అయితే పొద్దున తప్పక తెచ్చి ఇస్తాను.

**గురువు :** మఱి తెల్లవారిజామున నీవు నిద్ర లేవవే!

**శిష్యుడు :** తప్పక లేస్తాను.

**గురువు :** ఒకవేళ లేవకపోతే?

**శిష్యుడు :** లేపండి.

(సాధకునకు సోమరితనం పరమ శత్రువు. దానిని దరికి చేరనీయరాదు.)

# మీకు తెలుసా!

## 1) అష్టగంధములు — గంధములు ఎనిమిది కలవు. అవి ఏవనగా–

1. కర్పూరము, 2. కస్తూరి, 3. పునుగు, 4. జవ్వాజి, 5. అగరు, 6. పన్నీరు, 7. అత్తరు, 8. శ్రీగంధము–అనునవి.

## 2) అష్టదిగ్గజములు (ఏనుగులు) – వాని భార్యలు –

1. ఐరావతము – అభ్రము, 2. పుండరీకము – కపిల, 3. వామనము – పింగళ, 4. కుముదము – అనుపమ, 5. అంజనము – తామ్రపర్ణి, 6. పుష్పదంతము – శుభ్రదంతి, 7. సార్వభౌమము – అంగన, 8. సుప్రతీకము – అంజనావతి

## 3) పంచమాతలు (ఐదుగురు తల్లులు)–

1. రాజు భార్య, 2. అన్న భార్య, 3. గురుని భార్య, 4. భార్య యొక్క తల్లి, 5. తన యొక్క తల్లి.

## 4) నవరత్నములు –

1. వజ్రము, 2.వైఢూర్యము, 3.గోమేధికము, 4. పుష్యరాగము, 5.మరకతము, 6. మాణిక్యము, 7. నీలము, 8. ప్రవాళము, 9. ముత్యము.

## 5) యజ్ఞమునందు ఋత్విక్కులు నలుగురు కలరు– వారెవరనగా–

1. హోత – ఇతనికి సహాయముగా ఉండు ఋత్విక్కులు ముగ్గురు–
   1. బ్రాహ్మణాచ్ఛాంపి, 2. ప్రస్తోత, 3. మైత్రావరుణుడు
2. ఉద్గాత – ఇతనికి సహాయ ఋత్విక్కులు ముగ్గురు –
   1. ప్రతిప్రస్థాత, 2. పోత, 3. ప్రతిహర్త.
3. అధ్వర్యువు – ఇతని సహాయ ఋత్విక్కులు ముగ్గురు –
   1. అచ్ఛావాహకుడు, 2. నేష్ట, 3. అగ్నీధ్రుడు.
4. బ్రహ్మ – ఇతని సహాయ ఋత్విక్కులు ముగ్గురు –
   1. సుబ్రహ్మణ్యుడు, 2. గ్రావస్తుతుడు, 3. ఉన్నేత.

OO



# వసిష్ఠవాణి

## యోగవాసిష్ఠసారము

శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు ఇట్లు బోధించిరి-

లీల తన జగత్తునందలి యంతఃపురమును అట పుష్ప మధ్యమందుంచఁబడిన భర్తృ మృతక శరీరమును, చెంత సమాధియందున్న తన శరీరమును గాంచి, తదుపరి పతియొక్క సంకల్పమయ ప్రపంచమునఁ బ్రవేశించెను. అపుడు పతియగు విదూరథునకును సింధు రాజునకు యుద్ధము ప్రారంభము కాగా దానిని గాంచుటకు వచ్చిన వారిచే నాకసము పూర్ణమై యుండెను. అంత లీలా సరస్వతులిరువురును సంకల్పకల్పిత విమానములపైఁగూరుచుండి ఆ భయంకర సంగ్రామమునవలోకించిరి.

అనేక శస్త్రాస్త్రములచే వీరులు పరస్పరము శిరాద్యంగములను ఛేదించు కొనుచుండిరి. పలువురు సైనికులు మరణించుచుండిరి. బాణ ఖడ్గాదుల వృష్టి కురియుచుండెను. క్రమముగ యుద్ధము శమింప ఆ రణప్రదేశము మృతకశరీరములతోను, రక్తాదులతోను బూర్ణమై యుండెను. పిమ్మట రాత్రి సమయమున పిశాచాదు లట విహరింపసాగెను.

ఈ ప్రకారముగనున్న యా రణరంగమును వీడి ఆ ఇరువురు విదూరథుని రాజగృహమున సూక్ష్మచిద్రము గుండా ప్రవేశించిరి. అత్తఱి వారి ప్రభావముచే నా రాజు తప్ప తక్కిన యచటి వారందఱును నిద్రించుచుండిరి. రాజు పుష్పాంజలి నర్పించి వారలకు నమస్కరించెను. అపుడు తన సంకల్పముచే మంత్రిని మేలు కొలిపెను. ఆతడును లేచి వారికి నమస్కరించెను.

పిమ్మట దేవి రాజును తానెవరి పుత్రుడు, ఎపుడు జన్మించెను అని ప్రశ్నింప, మంత్రి అతని జన్మవృత్తాంతమును వివరించి చెప్పెను. అంతట దేవి తన హస్తము లతో నాతని మస్తకమును స్పృశింప రాజునకు తన పూర్వజన్మల వృత్తాంతమంతయు

స్పష్టముగాఁ దోఁచెను. అపుడు దేవి రాజుతోనిట్లనెను– ఈ జగద్రూప భ్రాంతి స్వప్నము వలె అసత్యమైనది. వాస్తవముగ నీవు జనించలేదు మరణించలేదు. ఆత్మవే అయి నీ యందు నీవు స్థితి గల్గియున్నావు. జగత్తు యొక్క అసత్యత్వము తెలియబడినప్పుడిక ఆ జగత్సత్యత్వభ్రాంతి యుండనేరదు.

ఓ రామచంద్రా! దేవి ఇట్లు వచించి తాము వెడలుచుంటిమని చెప్ప, అంత విదూరథుఁడు 'నేను నా మంత్రి అవివాహితయగు నా పుత్రి ఆ నా నిజలోకమున కలుగుటకై ఆజ్ఞను దయచేయు'మని వేడ, దేవి 'అట్లేయగుగాక! ఈ శ్రేష్ఠయుద్ధమందు నీవు మరణించి వారిరువురతో గూడ సూక్ష్మరూపములతో నీ పూర్వ స్థానమునకేగెదవు' అని చెప్పెను.

వారిట్లు సంభాషించుచుండ నింతలో భయభ్రాంతుఁడగు నొక మనుజుఁడటకు వచ్చి 'బాణ చక్రాద్యాయుధ సహితమగు గొప్ప సేన యేతెంచినది. నగరమంతట అగ్ని రగుల్కొనఁబడినది!' అని చెప్పెను. అపుడా దేవులిరువురు రాజు మంత్రి కిటికీగుండా బయటకు చూడ, ఆ నగరమంతయు సేనచేతను, చటచటా శబ్దములచేతను, అగ్నిజ్వాలలచేతను పరిపూర్ణమై యుండెను. ఇంతలో నచటికి సఖీజన సమేతముగ రాజపట్టమహిషి రెండవ లీల భయభీతయై యేతెంచెను.

ఒక సఖి అంతఃపుర స్త్రీజనమును శత్రువులు హరించుటను నగరము నాక్రమించుటను రాజునకు దెల్పెను. అది విని రాజు ఆ దేవిద్వయమువద్ద సెలవుగైకొని తన భార్యను సంరక్షించుచుండుమని ప్రార్థించి యుద్ధమునకు వెడలెను.

OO

**As a magic lantern throws images upon a screen without in any way tarnishirg it, so also all these worldly impiessions are merely reflected upon the changeless God.**

**మ్యాజిక్ లాంతర తెరను కళంకితముచేయకనే దానిపై బొమ్మలను ప్రసరింపజేయువట్లు, ఈ ప్రపంచ భావన లన్నియు, ఈ దృశ్యపదార్థములన్నియు నిర్వికార పరమాత్మ యందు**



# వేదాంత గోష్ఠి

## నేటి చర్చనీయాంశము– జన్మదుఃఖం

**శిష్యుడు (శివప్రసాద్)–** స్వామీ! గురుదేవా! ఏయే విషయములను గూర్చి బాగుగ చింతనచేస్తే మానవునకు ప్రపంచం ఎడల విరక్తి, దైవం ఎడల ఆసక్తి కలుగుతుందో వాటిని గూర్చి తెలుప ప్రార్థన.

**గురువు (ప్రబోధానందస్వాములవారు)–** నాయనా! శివప్రసాద్! మనస్సు దేవునివైపు సంలగ్నం కావాలంటే ప్రాపంచిక విషయాలనుండి మరలాలి. ప్రపంచంలో రెండు వస్తువులున్నాయి. ఒకటి శాశ్వతమైంది, మరొకటి అశాశ్వతమైంది. ఒకటి పరమానందకరమైనది, మరొకటి దుఃఖభూయిష్ఠమైనది. విజ్ఞుడైనవాడు ఆనందాన్నే అన్వేషించునుగాని, దుఃఖాన్ని గాదు. విజ్ఞతలేనివారు మాత్రమే క్షణికవస్తువులను కాంక్షిస్తూ, శాశ్వతాన్ని మరచిపోతారు. దృశ్యవస్తువులు క్షణికములు, పరమాత్మ శాశ్వతము. వివేకము కలవారు, పూర్వపుణ్యము లెస్సగ కలిగియున్నవారు మాత్రమే మహోన్నతమైన ఆత్మప్రాప్తి కొరకు నిరంతరం ప్రయత్నం చేయుచు దృశ్య వస్తువులపై విరాగము కలిగియుంటారు. పూర్వపుణ్యం లేనివారు, విజ్ఞత కలిగి యుండనివారు మాత్రమే ఈ నామరూపాలను అంటిపెట్టుకొనియుంటారు. అవే చాలా గొప్పవని భావిస్తూంటారు. వ్రణంలోని పురుగులు చీమును నాకి ఆనంద పడుచుండును గదా!

అయితే దృశ్యవస్తువులపై విరాగం మానవునకు ఏ విధంగ పుడ్తుందో, దైవం ఎడల ఆసక్తి ఏ విధంగ కలుగుతుందో చెప్తాను, విను. నీవడిగిన ప్రశ్న ఇదే. సంస్కృతంలో ఒక చక్కని నానుడి వుంది.

"ప్రదృశ్యతే వస్తుని యత్ర దోషః
న తత్ర పుంసోఽస్తి పునః ప్రవృత్తిః"

ఇది కాళిదాసు మహాకవి వచించిన మహత్తర భావాన్వితమైన వాక్యం. 'ఏ వస్తువునందు మనుజుడు దోషమును చూచునో, ఆ వస్తువునందు అతనికి మరల ప్రవృత్తి జనింపదు' అని పై వాక్యము యొక్క అర్థం. అజ్ఞానవశమున చెడ్డ వస్తువులో

మంచి గుణాన్ని చూస్తున్నాడు కాబట్టియే అజ్ఞాని చెడ్డవస్తువు వైపుకే పరుగెడ్తున్నాడు. కావున తెలివిగలవారు వస్తువులో గల దోషాన్ని చూచి ఆ వస్తువును త్యజించివేసి, ఉత్తమ పదార్థాన్నే అన్వేషించుట భావ్యము.

మానవుని జీవితంలో మొట్టమొదట కనుపించే దోషం జన్మదుఃఖం కలగటం. పుట్టేటప్పుడు ప్రతిజీవి ఎంత బాధ పొందుతున్నాడో అందరికి తెలుసు. ఈ భూతలం పైకి రాకపూర్వం 9 నెలలు తల్లి గర్భంలో నానాబాధలు పొందవలసి యున్నది. అదేమైనా శుభ్రమైన చోటా? కాదు... మలమూత్రాదుల కొంప. రక్తము, మాంసము, ప్రేగులతో కూడిన అశుభ్రస్థలం. అచ్చోట ఒక గంట కాదు, ఒకరోజు కాదు, ఒక నెల కాదు, 9 నెలలు వరుసగ కాపురము ఉండాలి. ఆహా! అనూహ్యమైన బాధ, పరమదుఃఖం. ఈ ప్రకారంగా నవమాసాలు తీవ్రమైన బాధలు అనుభవించి, మహాదుఃఖాన్ని చవిచూచి నెమ్మదిగ భూతలంపైకి దిగివస్తాడు.

ప్రసవసమయాన తల్లికెంతో బాధ కల్పిస్తాడు. ఇతరులకు కూడా శ్రమ కల్పిస్తాడు. ఈ విధంగా తాను బాధనొందుటయేకాక, తాను దుఃఖమనుభవించుటయే కాక ఇతరులకు కూడ శ్రమ కల్గించి నెమ్మదిగా పృథ్వీతలంపై దిగుతాడు. భూతలంపై పడిన వెనుక ఇక అతని అవస్థ దేవుని కెరుక. ఏడుపుతోనే జీవితం ప్రారంభిస్తాడు. తెలివి వుండదు. తానెవరో తెలియదు, ఎక్కడ వచ్చి పడ్డాడో తెలియదు, ఎక్కడకు పోవాలో అంతకంటే తెలియదు. ఇక బాల్యారిష్టాల సంగతి చెప్పవలసిన పనిలేదు. ఆ బాధలన్నీ అందరికీ తెలుసు.

ఈ విధంగా మహాదుఃఖకరమైనటువంటి జీవితాన్ని, జన్మను విజ్ఞుడైన వాడెవడైనా కోరుకొంటాడా? మరల మరల పుట్టాలని వాంఛిస్తాడా? విజ్ఞుడెవడు అట్లు కోరుకోడు. పుట్టుక, చావులు లేని పరమాత్మనే వాంఛిస్తాడు. మోక్షమునే కాంక్షిస్తాడు.

శివప్రసాద్! ఈ జన్మదుఃఖాన్ని గూర్చి నీవు బాగా పర్యాలోచించి, దీనిని గూర్చి బాగుగ చింతనజేసి, చావుపుట్టుకలందు విరక్తి కలిగి, ఇక జన్మే లేకుండా చేసుకొనే ప్రయత్నం ఆచరించాలి. అదే మోక్షయత్నం. అదే దైవప్రాప్తి. ఈ బంధనం నుండి ఎంత త్వరగా తప్పించుకొంటే అంత మంచిది. అర్థమైందా?

**శిష్యుడు–** గురుదేవా! అర్థం కాకపోవటమేమిటి, తమరు చెప్పిన భావాలన్నీ చక్కగా హృదయంగతమైనవి. ఇప్పుడు పరిస్థితిని చక్కగ ఆకళింపు చేసుకొన్నాను. అయ్యో! జన్మదుఃఖం ఎంత భయంకరమైంది. మహాత్మా! తమరు ఉపదేశించిన ప్రకారం ఈ దుఃఖాన్ని తప్పించుకొనే ప్రయత్నం చేస్తాను. కర్మను దగ్ధమొనర్చివేసే ఆత్మజ్ఞానాన్ని బడయటానికై అహర్నిశలు కృషి సలుపుతాను. అనుగ్రహించండి. సెలవు.

OO

# పరమార్థసూక్తులు



1. కాలుజారినచో తీసికొనవచ్చును. కాని నోరుజారినచో తీసికొనలేము.
2. జనులను ఇంకను గొప్ప విషయముల కొఱకు మలుచుటకు వాడబడు పరికరములే కష్టములు.
3. అందమైన వాక్యములన్నియు ఏకమైనను ఒక అందమైన చేతతో సమానము కాజాలవు.
4. మనుష్యుడు ఏ విధముగా జీవించవలెనో నేర్పుటయే మతములన్నిటియొక్క చరమలక్ష్యము.
5. శక్తి రూపాంతరము పొందునుగాని నశించదు. అట్లే నిజాయితీతో చేయు కృషి నిరర్థకము కాదు.
6. సంతోషము అంగడిలో దొఱకు వస్తువు కాదు. దానిని ఎవరికి వారు కష్టపడి సంపాదించుకొనవలెను.
7. అమర్యాదగా జీవించుట కంటె గౌరవముగ మరణించుట మేలు.

OO

## వేదాంతభేరి శాశ్వత చందాదారులు

## (Life Members)

వేదాంతభేరి మాసపత్రికకు నూతనముగ చేరిన శాశ్వత చందాదారుల పేర్లు :–

1. శ్రీ బి.వి. నారాయణమూర్తి గారు – పుట్పర్తి
2. శ్రీ పి. చక్రపాణి గారు – వరంగల్
3. శ్రీ జి. సిద్ధేశ్వర్ గారు – అనంతపూర్
4. శ్రీ కె. నారాయణశెట్టి గారు – బెంగుళూరు

OO






యోగవాసిష్ఠ రత్నాకరము, భాగవతరత్నాకరము మొదలైన గ్రంథములు పునర్ముద్రితములైనవి. కావలసినవారు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

## భక్తకన్నప్ప కంటి ఆస్పత్రిలో పురుషుల వార్డు

శ్రీ కాళహస్తి యందలి శ్రీ శుకబ్రహ్మాశ్రమమునందు నూతనముగ నెలకొల్పబడిన "భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి"లో పురుషుల వార్డు నిమిత్తము అమెరికా వాస్తవ్యులు శ్రీ డా॥ సి. గిరిజా సుదర్శన్ గారు 50 వేల రూపాయల విరాళము నొసంగిరి. వారికి మా అభినందనలు.

—కార్యదర్శి

"భక్త కన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి"కి నూతనముగ విరాళముల నొసంగిన దాతల పేర్లు—

| | | రూ. |
|---|---|---|
| 1. | శ్రీ జి.పి. యాదయ్య గారు, హైదరాబాదు | 11,116 |
| 2. | శ్రీ పి.వి.ఎస్. సోమయాజులు గారు, మద్రాస్ | 11,116 |
| 3. | శ్రీ ఎమ్. నవనీతమ్మ గారు, తిరుపతి | 5,001 |
| 4. | శ్రీ గాలి రాధాకృష్ణయ్య గారు, పుత్తూరు | 1,116 |
| 5. | శ్రీ ఎమ్. చినస్వామి గారు, ధవళేశ్వరం | 1,000 |
| 6. | శ్రీ జి. వీరాస్వామి గారు, కొండేపాడు | 150 |
| 7. | శ్రీ కె. భాస్కరరావు గారు, కొండేపాడు | 150 |
| 8. | శ్రీ అన్నపూర్ణ కె.సి. గుప్త గారు, హైదరాబాద్ | 250 |
| 9. | శ్రీ పి. భాస్కరరావు గారు, హైదరాబాద్ | 250 |
| 10. | శ్రీ పి. ఛాయాదేవి గారు, హైదరాబాద్ | 250 |
| 11. | శ్రీ డి. ముత్యాలు గారు, హైదరాబాద్ | 251 |

| | | |
|---|---|---|
| 12. | శ్రీ సి. వసంత్‌కుమార్ గారు, హైదరాబాద్ | 251 |
| 13. | శ్రీ వి. రామానుజరావు గారు, హైదరాబాద్ | 216 |
| 14. | శ్రీ సి. చంద్రశేఖర్ గుప్త గారు, నంద్యాల | 416 |
| 15. | శ్రీ కె. ఈశ్వరయ్య గారు, హైదరాబాద్ | 250 |
| 16. | శ్రీ జి. జయరామకృష్ణారావు గారు, హైదరాబాద్ | 500 |
| 17. | శ్రీ కె. రామకృష్ణ గారు, హైదరాబాద్ | 516 |
| 18. | శ్రీ కె.ఎస్.ఎన్. మూర్తి గారు, నెల్లూరు | 300 |
| 19. | శ్రీ కె. నాగప్ప & సన్స్, బెంగుళూరు | 251 |

రు. 116/- విరాళము ఒసంగిన దాతల పేర్లు:-

20. శ్రీ చిర్రావూరి వేంకటలక్ష్మి గారు, అయిలూరు
21. శ్రీ ఎమ్.ఎల్. సుబ్బారావు గారు, కరీంనగర్
22. శ్రీ జె. సంజీవప్ప గారు, ఆలూరు
23. శ్రీ ఎమ్. నారాయణ గారు, బొంబాయి
24. శ్రీ నారాయణం ఓంప్రకాశ్ గారు, తెనాలి
25. శ్రీ ఎమ్. రామిశెట్టి గారు, కదిరి
26. శ్రీ జి. ప్రతాపరెడ్డి గారు, ముచ్చుమర్రి
27. శ్రీ బి. సుబ్బారెడ్డి గారు, రావెల
28. శ్రీ వై. అనసూయమ్మ గారు
29. శ్రీ ఎస్. రామారావు గారు, కామయ్యపాలెం
30. శ్రీ కె. చంద్రారావు గారు, హైదరాబాద్
31. శ్రీ ఎ. యాదగిరి గారు, హైదరాబాద్
32. శ్రీ కె. లక్ష్మీబాల గారు, హైదరాబాద్
33. శ్రీ జె. శ్రీకృష్ణ గారు, హైదరాబాద్
34. శ్రీ బి. అన్నపూర్ణ గారు, సికింద్రాబాద్
35. శ్రీ కె. సూర్యనారాయణరాజు గారు, హైదరాబాద్
36. శ్రీ జి. మాధవరెడ్డి గారు, హైదరాబాద్
37. శ్రీ యు. సుబ్రహ్మణ్యం గారు, హైదరాబాద్
38. శ్రీ జె.ఎస్.రాజ్యం గారు, హైదరాబాద్
39. శ్రీ పి.వి. లక్ష్మీశర్మ గారు, హైదరాబాద్
40. శ్రీ జి.ఎన్.ఎస్. భార్గవ గారు, హైదరాబాద్
41. శ్రీ ఎ. ఉమాదేవి గారు, హైదరాబాద్
42. శ్రీ డి. సరళాబాయి గారు, హైదరాబాద్
43. శ్రీ కె. శేషగిరిరావు గారు, హైదరాబాద్
44. శ్రీ ఎమ్.వి. హనుమంతరావు గారు, హైదరాబాద్
45. శ్రీ శంకరయ్య గారు, హైదరాబాద్
46. శ్రీ పి. గీత గారు, హైదరాబాద్

47. శ్రీ జి. శ్రీకాంత్‌గుప్త గారు, హైదరాబాద్
48. శ్రీ లక్ష్మి గారు, హైదరాబాద్
49. శ్రీ నిర్మల ప్రేమసాగర్ గారు, హైదరాబాద్
50. సంపత్ వేంకటమ్మ గారు, హైదరాబాద్
51. శ్రీ బి. విజయలక్ష్మీదేవి గారు, హైదరాబాద్
52. శ్రీ పి.వి. కృష్ణారావు గారు, విజయనగరం
53. శ్రీ ఎ.వి.పి. ధర్మమూర్తి గారు, విజయవాడ
54. శ్రీ కె. సన్న్యాసయ్య గారు, విశాఖ
55. శ్రీ సుశీలాదేవి గారు, హైదరాబాద్
56. శ్రీ వి. లక్ష్మణయ్య గారు, చిట్యాలిగూడెం
57. శ్రీ బి. పుల్లయ్య గారు, నంద్యాల
58. శ్రీ సి.బి. కమలాకర్ గారు, నంద్యాల
59. శ్రీ బి.సి. వేంకటేశ్వర్లు గారు, నంద్యాల
60. శ్రీ పి.నాగమల్లయ్య గారు, నంద్యాల
61. శ్రీ కృష్ణకుమారి గారు, నంద్యాల
62. శ్రీ ఎమ్.రామారావు గారు, నంద్యాల
63. శ్రీ పి. పూర్ణచంద్రరావు గారు, తణుకు
64. శ్రీ వి. రామచంద్రన్ గారు, హైదరాబా
65. శ్రీ ఎమ్. సీతారామానుజాచారి గారు, సికింద్రాబాద్
66. శ్రీ టి. సుబ్బలక్ష్మి గారు, హైదరా
67. శ్రీ ఎమ్. సూర్యనారాయణ గారు, హైదరాబా
68. శ్రీ పి. నారాయణమూర్తి గారు, హైదరాబా
69. శ్రీ మాల్యాద్రి గారు, హైదరాబాద్
70. శ్రీ వి. అచ్యుతరావు గారు, హైదరాబాద్
71. బి.జి. సుభద్రమ్మ గారు, నంద్యాల
72. శ్రీ పి. సీతారామయ్య గారు, హైదరాబాద్
73. శ్రీ బి. క్రిష్ణన్న గారు, కర్నూలు
74. శ్రీ ఎమ్. రామకృష్ణప్రసాద్ గారు, మచిలీపట్నం
75. శ్రీ ఎ.వి. శేషయ్య గారు, ఆత్మకూరు
76. శ్రీ కె. హరనాథ్ గారు, హైదరాబాద్
77. శ్రీ కె. ప్రకాశరావు గారు, తిరుపతి

విరాళములు పంపదలంచినవారు ఈ క్రింది అడ్రసుకు పంపవచ్చును.

సెక్రెటరి, శ్రీ భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి
శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీకాళహస్తి - 517 640 చిత్తూరు జిల్లా

Printed and Published by **Vemuri Balaram** for Sri Sukabrahma Ashram
Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada
**Editor : B. ESWAR**

# నారద భక్తి సూత్రములు-81

## త్రిసత్యస్య భక్తిరేవ గరీయసీ భక్తిరేవ గరీయసీ.

తా॥ త్రికాలములందును సత్యమగు భగవంతుని యెడల భక్తియే అన్నిటికంటెను శ్రేష్ఠమైనది. అట్టి భగవద్భక్తియే శ్రేష్ఠమైనది.

వ్యాఖ్య :- భక్తి విషయమందు లోకులకు ప్రమాణభూతుడైనట్టి నారదుడు భగవద్భక్తి యొక్క ప్రాధాన్యమును ఈ సూత్రమునందు వివరించుచున్నారు. ప్రపంచమందలి ప్రతివస్తువు కూడా ఒక కాలమందుండి మఱియొక కాలమందు అదృశ్యమై పోవును. దృశ్యవస్తువులన్నియు క్షణికములైనవి. నశ్వరమైనవి.

భూత, భవిష్యత్, వర్తమానములను మూడుకాలము లందును వెలయుచుండు భగవంతుడొకడే శాశ్వతుడు. కనుకనే అతడు త్రిసత్యస్వరూపుడు. త్రికాలములందును సత్యమై యుండు వాడు. అట్టి భగవంతుని యెడల భక్తియే ప్రపంచములోని సమస్త పదార్థములకంటెను శ్రేష్ఠమైనదనియు, దానిని మించిన వస్తువు ముల్లోకము లందును లేదనియు నారదుడు ముక్తకంఠముతో చాటు చున్నారు.

ఏలయనగా అట్టి భక్తియే భగవంతుని యొద్దకు జీవుని చేర్చు ఉపకరణము. "దైవ భక్తియే శ్రేష్ఠమైనది"-అని రెండు పర్యాయములు చెప్పుటవలన భక్తి యొక్క ఔత్కృష్ట్యము చక్కగ వెల్లడి చేయబడినట్లైనది.

ఓం